అనగా అనగా ఒక జిప్సీ అమ్మాయి ఉండేది. ఆమె రాజకుమారి కావాలని కలలు కనేది. ఆమె తన అమ్మమ్మతో ఒక గుర్రపు బగ్గీలో ఉండేది. ఆమె పేరు సినమాన్.

సినమాన్‌కి చాలా విషయాలు తెలుసు. స్ఫటిక బంతి లోకి చూసి ప్రజల భవిష్యత్తు చెప్పేది. రకరకాల మూలికలు ఎక్కడ దొరుకుతాయో తెలుసు, వాటితో కషాయాలు చేయటం తెలుసు. ఆమె గాలితో మాట్లాడేది, ఎలుగుబంటితో నాట్యం చేసేది.









అయితే ఆమెకు ఒక రాజకుమారుడుతో నాట్యం చెయ్యాలని ఉండేది.

సాయంత్రం భోజనాలు అయ్యాక, మంట దగ్గర కూర్చుని అమ్మమ్మ చెప్పే మంత్రగాళ్లు, వాళ్ల మాయలకు సంబంధించిన కథలు వినేది. జలదేవతలు, సముద్ర దొంగలు, రాకాసి బల్లులు, రాజకుమారీల కథలు వినేది. "రాజకుమారీ సైప్రీనా లాగా నేను కూడా ఒక మహలులో ఉంటే ఎంత బాగుంటుంది," అంది సినమన్.

"ఒక రాకుమారీ కూడా దుఃఖంగా ఉండవచ్చు," అమ్మమ్మ అంది.

"ఏం కాదు," అడవి నుంచి తెచ్చిన ఒక్క కొమ్మను చెక్కుతూ అంది సినమన్.

ఆ కొమ్మకి ఒక బొమ్మ రూపాన్ని ఇస్తున్న సినమన్‌ని చూసి అమ్మమ్మ సంతోషంతో నవ్వింది. "బంగారం కిరీటం కంటే విలువైనవి చాలా ఉంటాయి," ఆమె అంది.

సినమన్‌కి ఆమె మాటలపై నమ్మకం కుదరలేదు.





తన భవిష్యత్తు తెలుసుకోటానికి ఒక రోజు రాకుమారి సైబ్రీనా జిప్సీల గుర్రపు బగ్గీ దగ్గరకు వచ్చింది. స్ఫటిక బంతిలో చూసిన సినమన్ కళ్లు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. "నాకు విశాలమైన రాచమహలు కనపడుతోంది, అందమైన రాకుమారుడు కనపడుతున్నాడు. రత్నాలు, పగడాలు, ముత్యాలు, అనంత సంపద నాకు కనపడుతోంది!"

రాకుమారి సైబ్రీనా సంతోషంతో నవ్వింది. సినమన్‌కి ఒక వెండి నాణెం ఇచ్చింది. "నువ్వు ఎలుగుబంటితో నాట్యం చేస్తావని విన్నాను. అది చూడాలని నాకు ఉంది."

"నేను ప్రయత్నిస్తాను," సినమన్ అంది, "నాట్యం చెయ్యటానికి జాంబమామ అన్ని వేళలా ఇష్టపడదు."





సినామన్ తన దప్పు తీసుకుని పాట పాడసాగింది:

జాంబమామా, జాంబమామా

వచ్చి నాట్యం చెయ్యి,

జాంబమామా, జాంబమామా

నాతో అడుగులు వెయ్యి.

ఎలుగుబంటి వచ్చి, నాట్యం చెయ్యసాగింది.

"చాలా సంతోషంగా ఉంది," అంటూ రాజకుమారి తప్పట్లు కొట్టసాగింది. "నువ్వూ, నీ ఎలుగుబంటి తప్పకుండా రాచమహలుకి రావాలి. మనమంతా కలిసి ఆడుకుందాం. ఎప్పుడూ సంతోషంగా ఉందాం."

ఎలుగుబంటి తల అడ్డంగా ఊపి తాను రానని చెప్పేసింది.





అయితే సినమన్ ఏమాత్రం తటపటాయించలేదు. ఆమె అమ్మమ్మకు ముద్దు పెట్టింది. జాంబమామా, ఇతర జిప్సీలకు వీడ్కోలు చెప్పి రాకుమారి గుర్రపు బండిలోకి వెళ్లింది.

"ఈ రోజు నుంచి నువ్వు రాజకుమారి సినమన్‌వి," రాజకుమారి సైప్రీనా ప్రకటించింది.

అప్పటినుంచి అందరూ ఆమెను అలాగే పిలుస్తున్నారు.

మహలులోని సేవకురాళ్లు ఆమెకు పన్నీటితో స్నానం చేయించారు. చిందరవందరగా ఉన్న ఆమె జుట్టును సరిచేసి వాసన నూనెలు రాశారు. ఆమెకు సాటిన్ గౌను తొడిగారు. నెత్తి మీద రత్నాలు పొదిగిన కిరీటాన్ని ఉంచారు.

సినమన్ తనని తాను అద్దంలో చూసుకుంది. అద్దంలో కనిపించిన అమ్మాయిని ఆమె గుర్తు పట్టలేదు.









మొదట్లో రాకుమారీలు ఇద్దరూ కలిసి ఆడుకునేవారు. రాకుమారీ సినమన్ నల్లని గుర్రపు పిల్ల మీద స్వారీ చేసేది. రాకుమారి సైప్రీనా తన రాచరికపు బొమ్మలు చూపించేది.

ప్రతి రోజూ సేవకురాళ్లు రాకుమారి సినమన్ జుట్టు దువ్వి వాసన నూనెలు రాసేవాళ్లు. ప్రతి సాయంత్రం ఆమె విశాలమైన మందిరంలో రాకుమారీలతో కలిసి నాట్యం చేసేది.

"ఇదంతా చాలా సరదాగా, బాగుంది కదూ?" నాట్యం చేస్తూ రాకుమారి సైప్రీనా అనేది.

తాను వేసుకున్న ఎత్తు మడాల చెప్పుల వల్ల సినమన్ కాళ్లు నొప్పి పుట్టసాగాయి. జాంబమామతో నాట్యం చెయ్యటం తనకి ఎక్కువ ఇష్టంగా ఉంటుందని రాజకుమారీ సైప్రీనాకి చెప్పాలనుకునేది కానీ ఆమె చెప్ప లేక పోయేది.





అలా రోజులు, వారాలు గడవసాగాయి. రాచరికపు బొమ్మలు ఇప్పుడు సినమన్‌కి అంత సంతోషాన్ని ఇవ్వటం లేదు. కీ ఇస్తే అవి ఎప్పుడూ ఒకే రకంగా ఆడతాయి.

"రాకాసి బల్లులు ఏవి, జలకన్యలు ఏవి?" సినమన్ అడిగేది.

రాకుమారీ సైప్రీనా తన సుకుమారమైన కాలుని పాలరాతి నేల మీద తాటిస్తూ, "ఇటువంటి పిచ్చి ప్రశ్నలు వెయ్యవద్దు సినమన్. ఇక్కడ రాకాసి బల్లులు, జలకన్యలు ఉండవు. నాకు ఒక మంచి జిప్సీ పాట వినిపించు!"

కానీ సినమన్‌కి పాట పాడాలని ఉండేది కాదు.

జిప్సీ రాకుమారి అంటే రాకుమారి సైప్రీనాకి విసుగుపుట్టసాగింది. అదే మాట ఆమె తన కొత్త స్నేహితులతో చెప్పేది.

నిజంగా సినమన్ అలాగే ఉండేది.





ఆ రాత్రి సినమన్ తన మెత్తటి పరుపు మీద అటూ, ఇటూ దొర్లింది. “నేను ఒంటరిని,” ఆమె ఏడవసాగింది. “పూర్తిగా ఒంటరిని.”

చివరికి ఆమెకి ఎప్పటికో నిద్ర పట్టింది. నిద్రలో అమ్మమ్మ తన కోసం వెదుకుతున్నట్టు కలగంది.

“సినమన్, సినమన్. ఎక్కడ ఉన్నావు, తల్లీ?”

“నేను దారి తప్పాను,” అంటూ సినమన్ బదులు ఇచ్చింది.

మరునాడు ఉదయానికి ఆమెకి ఆ కల గుర్తులేదు. కానీ తన కాళ్లకి చల్లటి పాలరాయి కాకుండా సజీవమైన నేల తగులుతుంటే బాగుంటుందని అనిపించింది. నాస్తా కోసం అందరూ కూర్చున్నప్పుడు ఆమెకి ఏమీ తినాలనిపించలేదు. తనని మన్నించమని సైప్రీనాని అడిగింది. ఆమె అసహనంతో చెయ్యి ఊపి వెళ్లమంది.









సినమన్ అక్కడి నుంచి బయటపడి మహలు పెద్ద తలుపులు దగ్గరకు చేరుకుంది. ఆమె వాటిని మెల్లగా తెరిచి గరుకు దారిలోకి అడుగుపెట్టింది.

"సినమన్, సినమన్," అంటూ గాలి ఆమె చెవుల్లో గుసగుసలాడింది. ఎత్తు మడాలతో ఆ దారిలో నడవటం కష్టంగా ఉండి సినమన్ వెనక్కి తిరిగి వచ్చింది.

ఆ రాత్రి మెత్తని పరుపు మీద పడుకున్న సినమన్‌కి కలలో ఆమె అమ్మమ్మ, జాంబమామ మళ్లీ కనిపించారు.

"నువ్వు ఎవరివి అమ్మాయీ?" అమ్మమ్మ అడిగింది.

"నాకు గుర్తుకు రావటం లేదు," అంటూ సినమన్ బదులిచ్చింది.

మరునాడు సినమన్ మరింత ఆందోళనకు గురి అయ్యింది. మహలు తలుపులు ఆమెకు బంగారపు పంజరాన్ని గుర్తుకు చేశాయి.







ఆ పెద్ద తలుపులను ఆమె పూర్తిగా తెరిచి దూరంగా చూస్తూ ఉండిపోయింది.

“సినమాన్, సినమాన్,” అంటూ గాలి గుసగుసలాడింది.

“గాలి నన్ను పిలుస్తోంది,” అని ఆమె అంది. తన ఎత్తు మడాల చెప్పులను వదిలేసి గాలి వెంట వెళ్లింది. కొండలు దాటి ఒక అడవి అంచుకి చేరుకుంది.

లోపలికి వెళ్లటానికి భయం వేసి ఆమె అక్కడే ఆగిపోయింది. తన బంగారు కిరీటాన్ని తాకుతూ, “నాకు తలనొప్పిగా ఉంది,” అనుకుంది. రాచమహలుకి తిరిగి వెళ్లిపోయింది.

ఆ రాత్రి కలలో ఆమెకు మళ్లీ ఆమె అమ్మమ్మ కనిపించింది. “బంగారు కిరీటం కంటే విలువైనవి చాలా ఉన్నాయి,” అమ్మమ్మ చెప్పింది.

నిద్రలోంచి లేచిన సినమాన్‌కి ఏమీ కనిపించలేదు. నీటి ఫౌంటెన్ దగ్గర గాలి తెమ్మెరలు అలలు సృష్టిస్తున్నాయి.





మరునాడు ఉదయం సినమాన్ తన ఎత్తు మడాల చెప్పులు వేసుకోలేదు. బంగారు కిరీటాన్ని కూడా పెట్టుకోలేదు. ఆమె నాస్తా చెయ్యటానికి భోజనాల గదిలోకి వెళ్లలేదు. ఆమె రాచమహాలు తలుపులు దగ్గరకు వెళ్లి వాటిని పూర్తిగా తెరిచింది. గాలి వెంట పడి వెళ్లసాగింది.

అడివి అంచుకి చేరుకున్న తరవాత ఒక్కసారి వెనక్కి తిరిగి దూరంగా మెరుస్తున్న రాచమహాలుని చూసింది.  గాలి ఆమె బుగ్గలను నిమిరి, "సినమాన్, సినమాన్," అంది. ఆమె చీకటిగా ఉన్న అడవిలోకి ప్రవేశించింది.

కొమ్మలకి, ముళ్లకి ఆమె బట్టలు చిరిగిపోతున్నాయి. కానీ ఈసారి సినమాన్ వెనక్కి వెళ్లలేదు. ఆమె అడవిలోకి ఇంకా లోపలికి వెళ్లసాగింది.  అలా వెళుతూ, ఆకాశంలో నక్షత్రాలు మెరిసే సమయానికి ఆమె ఒక వాగు ఒడ్డుకి చేరుకుంది.





అక్కడ ఆమె కాసేపు విశ్రాంతి తీసుకుంది. అడవి పళ్లు తిన్నది. ఆకుల మీద నిద్రపోయింది. మహలులో మెత్తటి పరుపు మీద ఎప్పుడూ పట్టనంత గాఢ నిద్ర ఆమెకు పట్టింది.

సేవకురాళ్లు, తళుకులీనే మహలు గోడలు కనపడతాయేమోననే సగం ఊహతో ఆమె నిద్ర లేచింది. కానీ, వాటికి బదులు ఆమెకు బంగారంలా మెరిసే ఎండ స్వాగతం పలికింది. అడవిలోని కొలనులో ఒక పెద్ద ఎలుగుబంటి స్నానం చేస్తోంది.

"జాంబమామా!" సంతోషంతో సినమాన్ అరిచింది.

జాంబమామ గాలి వాసన చూశాడు. తన తప్పిపోయిన స్నేహితురాలు తనను పిలిచినట్టు దానికి అనిపించింది. కానీ, సినమాన్‌ని జాంబమామ గుర్తు పట్టలేదు.





“గర్ర్ర్!” మంటూ అది అరిచి, చెరువులోంచి బయటకు వచ్చి అడవిలోకి మాయమైపోయింది.

“నేను అంతగా మారిపోయానా?” తేటనీటిలో తన ప్రతిబింబం చూసుకుంటూ సినమాన్ అనుకుంది. ఆమె తన జుట్టుని తాకింది. నూనెలు రాసి, నున్నగా దువ్వినందువల్ల అది ఆమె తలకి అంటుకుని పోయి ఉంది.

“అయ్యో!” అనుకుని సినమాన్ వెంటనే చెరువులోకి దూకింది. జుట్టు జిడ్డు వదిలేవరకు ఆమె తనివి తీరా స్నానం చేసింది. “నేను ఎవరో జాంబమామ మరిచిపోయి ఉండవచ్చు. కానీ, నేను మరిచిపోలేదు.”

“నేను సినమాన్‌ని! ఒక జిప్సీ అమ్మాయిని! నాకు గాలితో మాట్లాడటం తెలుసు...”





“…జాంబమామ అడుగుజాడలు ఎలా గుర్తించాలో తెలుసు.”

ఆమె ఆ రోజంతా నడుస్తూనే ఉంది. సూర్యుడు అస్తమించి ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. అయినా ఆమె జాంబమామ అడుగులను అనుసరిస్తూ చివరికి తమ జిప్సీ శిబిరానికి చేరుకుంది.

శిబిరం దగ్గర మండుతున్న మంట కొంచెం తగ్గింది. ఆమె రావటం ఎవరూ చూడలేదు, వినలేదు. ఒక్క జాంబమామ తప్ప. అది గాలి వాసన చూసి, “గర్ర్ర్!” మంది.

సినమాన్ మెల్లగా పాడటం మొదలుపెట్టింది:

జాంబమామా, జాంబమామా

వచ్చి నాట్యం చెయ్యి,

జాంబమామా, జాంబమామా

నాతో అడుగులు వెయ్యి.







ఆ రాత్రి అంతా వాళ్లు నాట్యం చేస్తూనే ఉన్నారు!

అయిపోయింది